తాళ్ళపాక పదసాహిత్యము - సంపుటము -

# శృంగార సంకీర్తనలు



అన్నమాచార్య ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానములు

తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం - 25

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కర్త

కీ. శే. గౌరిపెద్ది రామసుబ్బశర్మ




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

T.T.D. Religious Series - 557

ప్రథమ ముద్రణ : 1984
ద్వితీయ ముద్రణ : 1998





ప్రతులు : 2,000

వెల : రు. 25-00

ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

*ఇందరికి అభయంబు లిచ్చు చేయి*
*కందువగు మంచిబంగారు చేయి ॥*

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమత: తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి ప్రపత్తి దేహోత్మేశ విచారాదులను తెలిపే ఆధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు అధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

# తాళ్ళపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1.2భాగాలు) | 4 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్ళపాక చినతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్ళపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయ బడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

# పీఠిక

మధురై రుజ్జ్వలై ర్వ్యాపైః వాచికాంగికసాత్త్వికైః॥
శృంగారం యః పుపోషాద్యే బ్రహ్మణే శ్రీపతే నమః॥

1501వ రేకునుండి 1600 ల రేకువరకుగల 100 రేకులలోని పాటలుగలది ఈసంపుటము. 1521 నుండి1580 వరకు గల 10 రేకులు, 1581 నుండి 1590దాకగల 10 రేకులు వెరసి 20 రేకులు ఇందులో లేవు.

ప్రతిశృంగారసంకీర్తనలసంపుటమునందును ఏదైన ఒక వ్యాకరణ విషయము చర్చించుట పరిపాటి. కడచిన సంపుటమునందు 'అన్నమయ్య శృంగారభండారము' అను శీర్షికతో శృంగారమునందు అన్నమయ్య విరివిగా వాడిన కొంతపదసముదాయమును ఎత్తి చూపడము జరిగినది. అతరువాత ఒకటి రెండుపాటలు వ్యాఖ్యానింపబడినవి. ఈసంపుటమునందు కొన్ని పాటలు తేటతెలుగు పదములలో నున్నను, భావము లోతుగా నున్నవానిని వ్యాఖ్యానింప దలచితిని.

అన్నమయ్య తనపాట, తనపాటగల గ్రాంథిక వ్యావహారిక పదములను గుట్టుమట్టు ఎరిగి ఆయాస్థలములందు ప్రయోగించినాడు. ఆయన పలుకుబళ్ల వెంబడి అలంకారములు వద్దంటే వాములుగా నడచి వస్తాయి.

మనకంతా పూజనీయుడు, వరాలిచ్చేవాడు, సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుడు అయిన శ్రీవేంకటేశ్వరుడు, అన్నమయ్య శృంగార సంకీర్తనలలో ఏ పరిస్థితికి వచ్చినాడో ఈక్రింద పాటలో గుర్తింపుడు. ప్రతిపాట పైకి శృంగారభావము, లోపల అధ్యాత్మ్యభావము రెండును సమప్రధానములుగా ఉండుట ఇందలి విశేషము.

### దేసాళం

అప్పుడు పరాకై వుండె నది యెఱఁగవు నీవు
ఇప్పు డాకె గనుఁగొని యేమనునో యఁకను ॥పల్లవి॥

కప్పురవువసంతము కలికి నీపై వాడఁగా
దప్పిదేరె నక్కడి బడలిక వానె
కొప్పు ముడుచుకో యఁకఁ గొనగొంగు చెరువుకో
చొప్పు లాపె గంటేను నూడువట్టీ నిన్నును ॥అప్పు॥

గక్కన నీవు రాఁగానె కాంత పన్నీరు చల్లఁగా
చెక్కుచెమటెల్లా జారె పేదలుదేరె
చక్కదిద్దుకో వాసము చందన మలఁదుకో
వెక్కసా లివెల్లాఁ గంటే వెంగమాడీ నిన్నును ॥అప్పు॥

దగ్గర నీవు గూచుండేతరి పూవుల వేయఁగా
కగ్గిన యలఁతదేరె కాఁకలు మానె
యెగ్గులేక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
సిగ్గరి యాపె గంటేను చిమ్మురేఁచీ నిన్నును ॥అప్పు॥

(ఈ సంపుటము—పాట౹)

అన్నమయ్యాచేతిలో కొన్నివేలమంది దాదులు, నాయికలు, ప్రతినాయికలు, కొందరు మహానాయికలు ఈవాఙ్మయములో తీరినారు. ఈపాటలో ఎక్కడనో ఏ సాధారణ నాయికనో గోచెలికత్తెనో వలచి, వలపించి, తనిపించి మహానాయిక దగ్గరకు వచ్చిన శ్రీవేంకటేశ్వరుని, ఆ మహానాయికచెలికత్తె హెచ్చరించి నాయకుని కోసము కప్పుచున్నట్లు ఈపాటకు ప్రకరణముగా చెప్పవచ్చు.

నీవు ఇంకొకనాయికతో (వాతో) వున్నప్పుడు మా మహానాయిక ఎక్కడనో పరాకున వుండినది. అసంగతి నీకుతెలియదు.

ఇప్పుడు ఇతరకాంతలను భోగించివచ్చినలక్షణములుగలనిన్ను ఆమె చూస్తే ఏమిమండిపడుతుందో కదయ్యా అని చెలికత్తెమాట. ఈ పల్లవిలో ఇంతపొరపాటు ఎందుకు చేసితివయ్యా ఆ వచ్చిలక్షణముతోనే ఏల ఇక్కడికి వచ్చితివయ్యా అనుటవ్యంగ్యము.

మొదటిచరణములో వచ్చినవాయకునకు కప్పురవసంతముతో ఎదురాడుతూ వచ్చినది మహానాయిక. పసుపునీరు, కొద్దిపాటి సున్నము, దానిలో పచ్చకప్పురము, ఏలకులు, లవంగాలు, వట్టివేరు అంతా కలిసినదానిని కప్పురవసంతమంటారు. దానిని మహానాయిక స్వామిపై చిలికించినది. దానితో అక్కడ అలసిపోయివచ్చినస్వామికి దప్పి తీరినది. బడలికనుండి తేరుకొన్నాడు. కాని కొన్ని లక్షణములు ఇంకా సరిదిద్దుకోవలసినవి ఉన్నాయి. వాటినిగూర్చి హెచ్చరించు చున్నది చెలికత్తె. స్వామి సిగముడి చెదరియున్నది. రింగులువారగట్టిన ధోవతికొంగు వీడిపోయివున్నది. స్వామి తనఇంటికి వేంచేసి నాడని ఉవ్విళ్లూరిపోవుచు వసంతముతో ఎదురాడే మహానాయిక ఈసిగముడివీడడమును, దోవతికొంగు జారడమును గుర్తించినదంటే నీపై పగబట్టుతుందయ్యా కాబట్టి 'కొప్పుముడుచుకో', 'ఇంకా గొనగొంగుచెరుపుకో' అను మెత్తనిమాటలతో స్వామిని హెచ్చరించుచున్నది. నాయికచెలికత్తెలైనను, నాయకునకు కావలసినవారే. నాయికానాయకులు సంబరములతో నుంటేనే వీరికి చనవు సత్కారములు జరుగుతాయి, లేకుంటే ఇరుప్రక్కలా వీరికి చీదరింపులే. అందువలన నాయికచెలికత్తె నాయకుని హెచ్చరించుట, ఆయన తప్పులనుకాపాడుట తనధర్మము.

ఇక రెండవచరణములో నాయకుడు తన ఇంటికి దయచేయగా మహానాయిక స్వామికి పన్నీరుచల్లుచు ఎదుర్కొన్నది. దానితో స్వామి ఇంకొకచోట పడినశ్రమవలనకలిగినచెమటెల్ల సడలినది స్వామి కొంత కుదుటపడినాడు. కాని జారినవామ మట్టులే

యున్నది. చందనము కరిగి పోయివున్నది. మనసుకు బరువయ్యే "ఇటువంటి వేషాలను" మహానాయిక గుర్తించెనా దేవరవారికి దెప్పి పొడవులు తప్పవు. కాబట్టి నామమును సవరించుకొని, కరగిన చందనమును పలుచగా మెత్తించుకొని, నాయికకంటికి క్రొత్తగా వచ్చినట్లే అగపడవయ్యా అని హెచ్చరించుచున్నది నాయికచెలికత్తె.

మూడవ చరణములో మహానాయిక ప్రక్కన మనస్వామి కూర్చుండగా, ఆమె ఆయనపై పువ్వులువిసరినది. పువ్వులలోని మెత్తదనముతో పుప్పొడులతో స్వామికి అలవు దీరి వేడిచల్లారినది. 'స్వామీ! నన్ను మీరనుగ్రహించితిరి. మహానాయిక మిమ్ముల్లనూ, నన్నూ చూస్తే మీపైరుసరుసలాడుతుంది. అని హెచ్చరించింది.

ఈపాటలో మూడవచరణము మూడవపాదము ' ఎగ్గులేక శ్రీవేంకటేశ నన్నునేలితివి ' అను పాదముతో పూర్వ పాదములను జతచేసినపుడు అన్వయము కుదురనట్లే తోచును కాని ఎగ్గులేక అన్న- పాదములో స్వామిఅనుగ్రహామునకు పాత్రమైన నాయికసఖియే, స్వామిని తన నాయకురాలిదగ్గరకు తోకొని వచ్చుచు, నాయిక చేసిన స్వాగత సత్కారములతో మాటుపడక మిగిలిన సిగముడి, నామము వగైరాలసవరణములహెచ్చరికతో తననూ స్వామిని కాపాడుచూ హెచ్చరించు చున్నది ఈచెలికత్తె. ఇక్కడ ఇది గుణీభూతవ్యంగ్యము. మరియొకపాట:—

శ్రీరాగం

అందరిలో నీవు నన్ను నానకొలిపేవుగాక
పొందు నీకే కలిగితే భోగించవా ॥పల్లవి॥

చిత్తము రా నీసేవ సేయఁగలఁగాక నీకు
బత్తి గొట్టానఁ బెట్టేనా పలుమారును
వత్తునంటాఁ జెప్పెంపేవు వారివీరిచేత నేఁడు
వొత్తి నే నంతకతొల్లి వొద్దంటినా ॥అంద॥

సముఖాన నుండి సరసములాడఁగలఁగాక
తమకము రేఁచేనా తగిలి నీకు
చెమటలు గారఁగాను చేతులు చాఁచేవు నీవు
అమరఁ గాఁగిలించఁగా నౌఁగాదనేనా ॥అంద॥

ననుపు పేసుక నీతో నవ్వు నవ్వఁగలఁగాక
పెనఁగి గుణము చక్కఁబెట్టేనా నేను
యెనసితివి శ్రీవేంకటేశ ఇంతలోనే నన్ను
వొనర కెన్నఁడైనా వొద్దుకొంటినా ॥అంద॥

(ఈ సంపుటము. పాట-30)

పదుగురిలోనున్న నాయికను గిలిగింతలుచేసి, మనసు చెర రేగునట్లు మాటలాడించి, తుదకు ఆపెను అనుగ్రహించక యే పోయిన స్వామినిగూర్చి, ఆమె ఏకాంతమున విన్నవించుకునే మాటగా ఈ పాటకు ప్రకరణము తోచుచున్నది.

నలుగురిలో నున్నప్పుడు నాపై నీకూ తమకమున్నట్లు ఏమేమో మాటలాడి నన్ను ఆకొలుపుతావు. అంతే నాపై నిజమైన ప్రేమవుంటే నన్ను భోగించక వుంటావా? ఇది నాయిక వాక్యము. ఈమె కొంత అమాయకురాలు. స్వామి చెప్పి సేవలు లేదా, స్వామికి చేయవలెనని తనకు తోచిన సేవలు చాలా మర్యాదగా బాగుడునాయకాక చేసే గుణవంతురాలైన నాయిక.

మొదటిచరణములో నీమనసుకాకునట్లు నీకు నేను సేవలు చేయగలను కాని, నీపై నాకున్న ప్రేమ పిడికటబట్టిచూపగలనా? ధర్మార్థకామములు, పాపపుణ్యములు, కామక్రోధాదులు, ప్రేమాసూయలు అనునవి మనిషి చేసే పనులవలన పరమనసును గుర్తెరగవలెగాని, వైశద్యములను ప్రత్యక్షముగ సాకారముగ చూపుటకు వీలుపడదుకదా. అంటే నేను నీమాట కెదురాడను. నాకప్పగించిన

సేవను లేక, వారు తోచినసేవను నేను మాటలాడక చేసికొనిపోవు చుందును. నీపై నాభక్తి(ప్రేమ)ఇంతా అని నేను ప్రత్యక్షమున చూపగలనా? నేడు వస్తా రేపు వస్తావని వారి వీరితో చెప్పింపుటే గాని నీవు వస్తే వేనెన్నడైన వద్దంటినా.

రెండవచరణము. నీ ఎదుటనుండి నీ మనసంటువట్లు సరసము లాడగలముగాని, నీ మనసులోలేని మోహమును నేను రేచగలనా. సరసములాడినసమర్థురాలగునాయికను గట్టిగా కాగిలించుకొనుట పతిపని. అది మనసులో ప్రేమ మున్నప్పుడే జరుగును. ప్రేమ మున్నది తనకు తాను పుట్టవలెగాని, లేనిదానిని ఒకరు పుట్టింపలేరు. నీ చేతులు చెమటగారగా అనగా నీ మనసు కరగుచుండగా అని అర్థము. నాపైకి చేతులు చాచుతావు. కాగిలించితే నేను వద్దన్నానా? ప్రథమ పరిష్వంగము పురుషునిది. తరువాతిది అంగనది అని కామశాస్త్రము. అది నీకు నేను నేర్పవలెనా అని వ్యంగ్యము.

మూడవ చరణమున, నీపై ప్రేమముట్టిపడగ నా నిండు మనసు నీ కప్పగించుచున్నట్లు నవ్వు నవ్వగలముగాని, నీ ప్రేమ–గుణము నాపై కెక్కునట్లు నేను చక్కబెట్టగలనా? నవ్విన నన్ను దగ్గరకు తీయవలసినది నీ ధర్మము. ఇక మూడవ చరణము మూడవ పాదమునుండి అన్నమయ్య మారిపోవుచున్నాడు. తొలి రెండు చరణములలో ఎంత విరహవేదన వర్ణింపబడినా, మూడవ చరణములో కరగి కలసి పోవుటయే ఈయనశృంగారరహస్యము. సుఖాంతముగ చూపవలెనను విశ్వాసముగూడ ఒకటి కావచ్చును. స్వామీ నేనట్లు అనుకొనుచున్నంతలోనే నన్ననుగ్రహించితివి. ఇంతకు ముందెన్నడైన మీరు నన్ను కావలెనన్నపుడు నేను ఎదురొడ్డు కొంటినా. మీ చరణదాసినికదా. నన్నింత వేగించి కూడుట, మీరు గట్టిగా నామనసు భక్త్యున్ముఖమైనదా లేదాయని పరీక్షించుటగా తలపోయుచున్నదాన. ధన్యాస్మి స్వామిన్ దన్యాస్మి.

అన్నమయ్య కొన్ని స్థలములలో ఒట్టిఅనుభావములతోనే పాటలో నిశ్శృంగారమును పొర్లిపోయేటట్టు వర్ణిస్తాడు.

ఈ క్రిందిపాటలో ఒక ప్రౌఢనాయిక, ఒక ముగ్ధనాయికను ఎత్తిపొడుస్తూ, ఆమె అభిప్రాయసూచకములైనఅనుభావాలను, అట్లనే ఆ అభిప్రాయాలనుకూడా వర్ణించడములో ఇది వ్యంగ్య ధోరణికి సున్నఇట్టి వాచ్యధోరణిలో పడినట్లు ప్రకరణమువలన అర్థ మవుతుంది.

పళవంజరం

ఇన్నాళ్లుఁ బకుచ వేమీ నెరఁగవంటా నుంటిమి
కన్నులారా నీయందుఁ గంటిమి వేడుకలు ॥ పల్లవి ॥

చెలరేఁగి లోలోనే చిరునవ్వులు
వలపులతలపోఁతవరుసా ఇది
అలయుచు సొలయుచు నసురుసుర య్యేవు
కొలఁదిమీరినరతికోరికా ఇది ॥ ఇన్నా ॥

చిట్టంటుఁ జెమటలతో సిగ్గువడేవు నీవు
దట్టమైనపాయపుమదములా ఇది
గుట్టుతోడఁ బులకలు గుబ్బతిల్లే విప్పు డిట్టె
మట్టులేనిశమకపుమర్మమా ఇది ॥ ఇన్నా ॥

యీడనే పానుపుమీఁద నెదురులు చూచేవు
కూడేటిఆసలకెల్లా గురుతా ఇది
పాడితో శ్రీవేంకటపతి నిన్ను నన్ను నేలె
వేడుకఁ జూచేవు వెల్లవిరులా యిది ॥ ఇన్నా ॥

(ఈ సంపుటము పాట 68)

ఇన్నిదినములు చిన్నదానవు; ఏమీ తెలియని దానవు; అను కొనుచూ వుంటిని. ఇప్పుడు నీయందు క్రొత్తక్రొత్త వింతలు గమ నిస్తున్నాను.' అని, బాగా అనుభవజ్ఞురాలైన ప్రౌఢనాయిక ముగ్ధ-నాయికతో అంటుంది. లోలోపలనే చెలరేగి చెలరేగిన మేమో తలచు కొని చిరునవ్వులు నవ్వుతున్నావు. ఇదిచూస్తే నీలోనివలపులు అంటే, రతి-సమయములో నాయకుని ఇట్లు చేయవలె అట్లుచేయవలె అని ఊహించే తలపోతలా. ఒకసారి అలసిపోయినట్లు సొలసిపోయినిటు ఉసుళ్లుకొడుతూ వుంటావు. నీశక్తికి మించిన రతిపైన కోరిక యాఅది. రతికై ఉబలాటపడుతున్న ఉవిద మధ్యవ్యాక్తులచేత, మధ్యనన్ని వేళ ములచేత, ఆరతిసమయము దూరమగుచుండగా ఉసుళ్లు కొట్టుకోవ డము కామశాస్త్రములో వర్ణింపబడినదే.

రెండవచరణములో బయటికి కనపడేటట్లు తొబ్బిలిచెమటలు కాక, చిట్టంటుచెమటలు=పలచనిచెమటలతో సిగ్గుపడుతున్నావు. నఖదంతక్షతాదులతో మురిసిపోయే ప్రాయపుమదమూ ఇది. ఒడలిపై గుబురుగా మొలకలెత్తు పులకలతో, లోపల లోపల గుబులు కొంటూ వున్నావు. తటుకోలే' పైకెగదటుచున్న కామమర్మమా ఇది. యువతీయువకులకు మొలకప్రాయములో ఆవరులకు చెప్పలేని కామమదము తనశరీరము పట్టక, పులకల రూపముగా ఒంటిపై పరువులు దీయుననుట కామశాస్త్ర రహస్యము.

మూడవచరణములో ఈ అనుభావముల కన్నింటికి తుదిపద మైనపడకటింటిలో పానుపుమీద, ఎదురుచూస్తున్న ముగ్ధనుగూర్చి ప్రౌఢనాయి.. నీవు అనుభవింపబోయే కోరికలన్నింటికి ఇది తుది గురుతా; ఇకపై పతితో మీరహాస్యప్రసంగమునకు ఇది మేరలేని గొప్పతనమయా. ఇంతకుముందే నేను చెప్పినట్లు మూడవచరణము ఉత్తరార్థములో సంభోగశృంగారముతో ముగిస్తున్నాడు అన్న మయ్య ... ... ప్రౌఢ ... ప్రౌఢుడు; ముగ్ధలకు

ముగ్ధుడు. కావున నిన్నూ నన్నూ అనుగ్రహించినవాడు. అని మోడ్పు కండ్లతో వలుదిక్కులం జూచేవు. మీరతి సంభ్రమంబట్టబయలా ఇది. అనగా రతిలో తనిసిన నాయిక అరవిరికనుదోయితో పతిని చూచుట శృంగారమర్మము. ఈ పాటలో ప్రౌఢనాయికకు ముగ్ధనాయిక పోటీదారు. తాను ప్రౌఢ కాబట్టి ముగ్ధను అధికారదర్పముతో మందలిస్తూవుంది.

అన్నమయ్య తన శృంగారకీర్తనలన్నీ లోపలి అర్థముతో అధ్యాత్మ పరములుగా వర్ణించినాడని సాహిత్యజ్ఞులమాట. మధురకు వెళ్లినతరువాత బలరామకృష్ణులు ఒకసారి గోపసుందరులను చూడ వచ్చినపుడు "గోపాలసుందరు లమందానందకందళితహృదయులై, హృదయేశ్వరుడైన గోవిందుండు చిరకాలసమాగతుం డగుటం జేసి, యతనిం జూచుతలంపు లుల్లంబుల వెల్లిగొనం జేరి,

చం॥ నలినదళాక్షుఁ జూచి నయనంబులు మోడ్పఁగఁజాల రెప్పలన్
వలచి తదీయమూర్తి విభవంబు దలంపుచుఁ గౌఁగిలింపుచున్
బులకలు మేన నాదుకొనఁ బొల్తులు చొక్కిరి; బ్రహ్మమున్ మనం
బులఁగని చొక్కు యోగిజనమున్ బురుడింపఁగ మానవేశ్వరా

(ఆం. మహాభాగవత దశమస్కంధం, ఉత్తర 1068, 1069)

అట్లనే

తే॥ ఘోర సంసార సాగరోత్తారణంబు
ధీయుతజ్ఞానయోగిహృద్ధ్యేయవస్తు—
వగుచుఁ దెలుపొందు నీ చరణాంబుజాత—
యుగళమును, మామకంబుఁ దగునీవె!

(ఆం. మహాభాగ. దశ. స్కం. ఉత్త 1070)

పద్యములలో గోపాంగనలభక్తిని శృంగారరూపముగ ప్రపంచించిన, పోతనవలెనే మన అన్నమయ్య ఈక్రింది పాటలో, వేంకటేశ్వరుని చూచిన భక్తులందరు తాము నాయికలై అపురుషోత్తముని మొగము చూచి, ఆతనితో సరసమాడి, ఆతనిమేను సోకి పరవశులై స్వామి చరణారవిందంబులనునావ నెక్కి సంసారసాగరమును తరించి ముక్తి ద్వీపమునకు చేరుకొన్నారని వర్ణించుట త్రిసత్యమైనమాట.

పాడి

అంటి నిన్నుఁ బాయలేని దాపె తలనే వేఁగెనా
వెంటవెంటఁ దిరుగరా వెలఁదులెల్లాను ॥పల్లవి॥

తలకొని నీమోము తప్పకచూచితేను
వలవరా యెటువంటివనితలైనా
సెలవుల నేపాటైనా చిరునవ్వు నవ్వితేను
మొలవవా పులకలు మోపులకొలఁదులు ॥అంటి॥

చనవున నీతోను సరసములాడితేను
మనసులు గరఁగరా మగువలెల్లా
ఘనసి నీతోఁ గన యేపాటి మాటాడినాను
తనుఁదానె కాఁగిళ్ల తగులుకోకుండునా ॥అంటి॥

నివ్వటిల్లుతమకాన నీమేను సోఁకితేను
నివ్వెరగుఁ బొందరా నెలఁతలెల్లా
రవ్వగా శ్రీవేంకటేశ రతి నలమేలుమంగ
యివ్వలఁ గూడినందుకు హెచ్చవా వేడుకలు ॥అంటి॥

(ఈ సంపుటము, పాట 282)

ఒకనాయిక తనపై జూపిన ప్రేమ వృత్తాంతము, ఇతర నాయికలకందరకు స్వామి సెలవియ్యగా, అప్పుడా నాయికలందరు స్వామితో ఈ క్రింది విధముగ పలుకుచున్నారనుట ప్రకరణము.

నిన్ను తాకిన తరువాత నిన్ను యెడబాయలేకుండుట ఆమె తలవే పొద్దుపొడచెనా. నీవెంట కాంతలందరు(భక్తులు)తిరుగుటలేదా. ఒకసారి నీముఖము తప్పక దీక్షతో చూచిన ఎటువంటిస్త్రీలైనా నీకు వలవరా. నీవు నీ సెలవులువార చిరునవ్వు నవ్వితే ఎటువంటి స్త్రీలకైనా మోపుంకోలదిగ పులకలు మొలవవా. నీతో చనవుగ సరసమాడినఏమగువలైనా మనసులు వెన్నవలె కరగరా నీతో ఏ కొంచము సేపు మాటలాడినా తమకు తామే పరవశలై కౌగిళ్ల నిన్ను చేరుకోవా. నిండు మోహాముతో నీ ఒడలు సోకితే స్త్రీలందరు నివ్వెరగు చెందరా. శ్రీవేంకటేశా! అలమేలుమంగను నీవు కూడి— నందులకు ఆమెకు వేడుకలు హెచ్చవా.

ఇది ఈ పాటలోనున్న స్థూలమైనఅర్థము. ఇందు ప్రయో గించిన వెంటవెంట దిరుగుట తప్పక చూచితే వలచుట, సెలవుల చిరునవ్వు నవ్వితే మోకులకోలది పులకలు మొలుచుట, చనవున సరసమాడితే వెన్నవలె మనసులు కరగుట, నీతో ఏపాటి మాటాడి నాను పరవశలై కౌగిళ్ల తమకుతామే తగులుకొనుట, నిండుమొహా మున నీమేను సోకితే నివ్వెరగందుట, రతిలో అలమేలుమంగను కూడినచో వేడుకలు హెచ్చుట అను ఈ పదములు కృష్ణపాదరజః పవిత్రములైనగోపికలయోగిమనస్తత్వమునకు, కామినీమనస్తత్వము నకును సమానములు వలచిన వానివెంటవెంట దిరుగుట, కామినీజనులధర్మము. స్వామిని కొలచెడివారు అయన వున్నచోటనే పరిభ్రమించుచుండుట యోగిలక్షణము. మొగము దీక్షగా చూచినచో అయనకు పరవశమగుట కామినీజనధర్మము. అట్లే స్వామిముఖమును మనసున నింపుకొన్నయోగి అయనకు పరవశుడగుట తత్వజ్ఞాని లక్షణము. స్వామి చిరునవ్వు నవ్వితే మనలను స్వామి అనుగ్రహించెకదా అని మనమున బుట్టినఆనందమునకు ప్రతిరూపములైనపులకలు శరీరముపైకనప్పట్టుట కామినీధర్మము. మనసున స్వామిని ధ్యానించు

నపుడుఆయన ఒకసారి చిరునవ్వుతో తనను చూచినట్లు అనుభవముగల భక్తునికి, ఆనందము పొంగులువారి శరీరమున నిడు వెన్నుక వెట్టుట యోగిధర్మము. అట్లులే స్వామితో చనవున సరసమాడితే ఆయన సరసన ఉన్నందున మనసు వెన్నవలె కరగుట కామినీధర్మము. సమాధియందు స్వామిఅంగీకరించినట్లు తనకు అనుభవము కలిగిన, అప్పుడు మనసు కరగుట అది యోగిజనధర్మము. కామినులు కాముకులతో ఏ కొంచము సేపు మాటలాడినా పరవశలై వానిని నిండుకౌగిట గుచ్చుకొనుట కామినీధర్మము. అట్లులే ధ్యాన సమాధిలో స్వామితో తాము మాటలాడినట్లు భావించినచో ఆ స్వామిని బట్టబయట కౌగలించుకొనుట యోగిజనధర్మము. కామినికి ప్రియునిమేను సోకితే నివ్వెరగుపడుట కామినీధర్మము. భక్తుడు స్వామి తనను స్పృశించినట్లు, వెన్నుచరచినట్లు సమాధిలో కనుగొనెనేని అప్పుడు తాను కొయ్యబారుట యోగిజనధర్మము. ఇక్కడ అల మేలుమంగ భక్తబృందమునకంతటికి ప్రతినిధి. ఆమె స్వామితో రతినంటనది. ఆమె రతి శారీరకముగా కావచ్చునేమో. భక్తుడు కూడా స్వామితో రతి=నిరతిశయప్రేమ, దానివలన గాఢపరిష్వంగము ఇత్యాదుల ననుభవించుచున్నాడు. కావున ఈపాట భక్తునికి కామినికి కలసమానధర్మములను నిరూపించుపదజాలముతో ఇమిడి యున్నదని నిరూపించితిని.

అన్నమయ్యశృంగారసంకీర్తనలన్నీ పైకి శృంగారతరములైనా లోపల స్వామిఅనుగ్రహమునకు పాత్రములగుట అనుభక్తనాయికాధర్మములతో వెల్లివిరియుచున్నవి. ఏ పాటయందుగాని "నన్నేలెను, నిన్నేలెను, ఆపెనుయేలెను" ఇత్యాది అనుగ్రహపర్యాయములైన రక్షణాత్మకములైన శబ్దములేకాని, పూర్తి శారీరక, సంబంధవాచికములైన శబ్దములు సమాగమసూచకములుగా మన అన్నమయ్య వాఙ్మయములో లేనేలేవు.

ఈసంపుటమునుండి సందిగ్ధపదసమీతము అయాపాటల క్రింద నే ఇచ్చుటచేత అశీర్షిక ప్రత్యేకతను కోల్పోయినది. పాఠకులు గమనింపగలరు.

తాళ్లపాకకవుల సంగీతసాహిత్యములను లోకమునకంతటికి పట్యారముగ పంచవలెనను భావము, దానికై రొక్కమెంత ఖర్చైనను వెనుకాడని పట్టుదల, అకారముదాల్చిన ఉత్సాహముగా అగపడుచున్న తి. తి దేవస్థాన పాలకమండలి అధ్యక్షులు శ్రీ పి. కె. డి. వి. సత్యనారాయణరాజు గారికి, వారి సభ్యులకును, మూడు పూవులారుకాయలుగ ఈకార్యమును నడిపించుచూ రూపెత్తిన దీక్షయో అన్నట్లు కనబడు శ్రీ కార్యనిర్వాహణాధికారులు శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఎ.యస్ గారికిని నాకృతజ్ఞతాభినందనలు. ఒకనెలపని ఒకవారములో తీర్చునస్వభావముగల తి. తి. దే. ప్రెస్ మేనేజరు శ్రీ M. విజయకుమారరెడ్డిగారికి, ప్రతిఅంశమునందును తలలోనాలుకగా పనిచేయుచు త్వరత్వరగ ముందుకు నడిపించు స్వభావముగల పౌరసంబంధశాఖాధికారి (P.R.O) శ్రీ R. సూర్యనారాయణమూర్తి, M.A, గారికి, అడుగడుగున మామాటలకు ముందుగనే, తమచేతలు చూపుచు మాకు సాయపడుచున్న 'సప్తగిరి' సంపాదకులు శ్రీ K. సుబ్బారావు M.A గారికిని నాధన్యవాదములు.

దాదాపు 6 ఏండ్లకుపైగా నాకీపరిష్కరణకార్యమునందు అన్నివిధముల సహాయకుడుగా చేయూతనిచ్చుచు, శ్రద్ధావిధేయతలు తనసొమ్ములుగా పనిచేయుచున్న చి॥ J. బాలసుబ్రహ్మణ్యం, M.A కును, ఉద్యోగని వీరికై పంత పిద్ధమ్ముగా కొనసాగించు నేర్పరులగు అచ్చుకూర్పరులకును నా మంగళాశాసనములు.

వాఙ్శుద్ధికి తగినంతగా జరిగిన ఈ పరిష్కరణములో గుణ-దోషములను గమనించిన పెద్దలు దోషములు తెలిపినచో పైపై పరిష్కరణములందు మెలకువగలిగి వుండగలమని మనవి.

వాక్శుద్ధే సోమనాథస్య రంగనాథకవేస్తథా
ప్రత్యర్థినః పరాభూతాః యేన తం నౌమి దేశికమ్॥

ఇట్లు
గౌరిపెద్ది రామసుబ్బశర్మ,
స్పెషలాఫీసరు,
అన్నమాచార్య వాఙ్మయమ్,
తి. తి. దేవస్థానములు.

తిరుపతి,
20-8-84.



శ్రీరస్తు

శ్రీతాళ్లపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు.

[స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౪౬ అగు-నేటి క్రోధిసంవత్సరమందు శ్రీతాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన-పదారుయేండ్లకు తిరువేంగళనాథుఁడు ప్రత్యక్షమైతేను, అది మొదలుగాను శాలి-వాహనశకవరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ-బహుళ ౧౨ విరుధానకు[1] తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగారసంకీర్తనలు.]

రేకు:- 1501 మాళవిగౌళ

నీవు మొదలిజాణవు నీకంటే జాణలు వారు
కావరపు నిన్నుఁ జూచి కన్నుల నవ్వేరు ॥పల్లవి॥

గుట్టున నెప్పుడైనో కూడవలసి యందరి-
నట్టే పనులు చెప్పి యంపేవు నీవు
నెట్టనఁ గొంద రిందుకే నీతలఁపు తా మెరిఁగి
చుట్టి చుట్టి నీయెద్దనే సుద్దులు చెప్పేరు ॥నీవు॥

---

౧. ఈ శబ్దము 'విరోధ' 'విరుద్ధ' శబ్దములకు వ్యావహారికరూపముగా గానవచ్చుచున్నది. అర్థగింపు, అవధి అని యర్థము. అనాఁడు కడవటి దినమని తాత్పర్యము. కీ॥ శే॥ ప్రభాకరశాస్త్రిగారూహించిన 'పరియగు' అను నర్థము తాత్పర్యార్థము గావచ్చును. 'అవధి' అను నర్థములో "ఈ విరుద్ధమునకుఁ గుశలంబు మాకు" అను తరిగొండవెంగ-మాంబగారి ప్రయోగము దీనికి సహాయపడుచున్నది'. సాహిత్య అకాడమీవారి 'విష్ణుపారి జాతము' ౬౬ పుట. నేనీప్రయోగ మివ్వగా శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, "విరుత్తం" అను అరవ పదముగాను 'విరుపు' అను నర్థముతో దీనికి సహాయపరచిరి.

పొద్దున నెవ్వరింటికో పోవలసి ఇంటివారి
నిద్దురలు వొమ్మనేవు నెమ్మది నీవు
వుద్దండపుకాంత లిది వూహించి తాము దెలిసి
వొద్దికతోఁ గాదములు వొత్తేరు నీకును ॥ నీవు ॥

సందడి నెవ్వతెతోనో సరసమాడవలసి
అందరి వసంతాలాడుమనేవు నీవు
ఇందె శ్రీవేంకటేశ నే నెఱఁగితేఁ గూడితివి
విందుచెప్పి కొందరైతే వేడుకఁగూడేరు ॥ నీవు ॥ 1

## గౌళిరామక్రియ

ఎడఁగొల్లకత్తె నీకె నేమందును
నడుమఁ బట్టరికాలు నడపీఁ దాను ॥ పల్లవి ॥

వంచనతో విందుచెప్పి వడి నిన్నుఁ దోడితేఁగా
కంచముపొత్తుకు నీకె గాచుకున్నది
మంచముపై నే నిన్ను మరి కూచుండఁబెట్టితే
లంచము మోవినియ్య లాఁచీఁ దాను ॥ ఎడఁ ॥

పైకొని నీచేతికి బాగా లొసఁగితేను
ఆకుమడిచియ్య నీకె అమరినది
చేకొని పవ్వళించఁగఁ జేసి నిన్నాదరించితే
కోకల గాఁ గాదాలొత్తఁ గోటుచేసుకున్నది ॥ ఎడఁ ॥

నేను నీవు కాఁగిటిలో నెయ్యము సలుపఁగాను
ఆసించి తనచన్నుల నంటుకున్నది
పూని శ్రీవేంకటేశుఁడ పొంది నే నేసవెట్టఁగా
కానిమ్మని కంకణము గట్టీఁ దాను ॥ ఎడఁ ॥ 2

వరాళి

నంటున నెంతువిధాలు నడపీఁ దాను
యింటచుట్టమైనవాఁడు సారె నేఁచనేఁటికే ॥పల్లవి॥

నాతో మాటలాడి యిట్టే ననుపు సేసినవాఁడు
యేతుల నెవ్వతెయింటి కేఁగఁగనేలే
చేతికి లోనైనవాఁడు సేవగొనుఁగాక తాను
కాతరానఁ బరాకులుగాఁ దనకేఁటికే ॥నంటు॥

నామోము చూచి నేఁడు నవ్వులు నవ్వినవాఁడు
వేమారు విన్నపాలు వినఁగనేలే
కామించి నావద్దికి గక్కున వచ్చినవాఁడు
చేముట్టి సంగడివారిఁ జెనకఁగనేఁటికే ॥నంటు॥

గట్టిగా నన్నుఁ గాఁగిటఁ గలసినయట్టివాఁడు
అట్టునేసి యొకతె కాఁబడి గానేలే
ఇట్టె శ్రీవేంకటేశుఁ డితఁడే నన్ను మన్నించె
గుట్టుతోడ నేమిటికిఁ గొంకనీఁగ నేఁటికే ॥నంటు॥ ౩

దేసాళం

అప్పుడు పరాకై వుండె నది యెఱఁగవు నీవు
యిప్పుడాకె గనుఁగొని యేమనునో యిఁకను ॥పల్లవి॥

కప్పురపువసంతము కలికి నీపై నాడఁగా
దప్పిదేరె నక్కడిబడలిక వాసె
కొప్పు ముడుచుకో యిఁకఁ గొనగొంగు చెరుపుకో
చొప్పు లాపె గంటేను సూడువట్టీ నిన్నును ॥అప్పు॥

గక్కున నీవు రాఁగానే కాంత పన్నీరు చల్లఁగా
చెక్కుచెమటెల్లా జారె నేదలు దేరె
చక్కఁ దిద్దుకో సామము చందన మేఁదుకో
వెక్కసా లివెల్లాఁ గంటే వెంగెమాడీ నిన్నును ॥ అప్ప ॥

దగ్గర నీవు కూచుండేతఁ బూవుల వేయఁగా
సిగ్గి యుబ్బఁక దేరె కాఁకలు మానె
యెగ్గులేక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
సిగ్గరి యాపె గంటేను చిమ్మిరేఁచీ నిన్నును ॥ అప్ప ॥ 4

## ఆహిరి

ఇద్దరుఁ గదిసినారు యెదురుబడి నున్నారు
పొద్దువొద్దునకు మిమ్ము బోదించవలనె ॥ పల్లవి ॥

పిలిచీ నూఁకొనరాదా ప్రియురాలు నిన్నునిట్టె
తల యెత్తి చూడరాదా దండ నున్నది
బలిమిఁ బెనఁగరాదా పంతముతే నెరపీని
చెలులముగన నేము చెప్పకుంటే రాదు ॥ ఇద్ద ॥

నవ్వీ మారు నవ్వరాదా నలినాక్షి నిన్నుఁ జూచి
జవ్వన మంటఁగరాదా సమ్మతించీని
పువ్వుల వేయఁగరాదా పొంచి సరస మాడీని
ఇవ్వల నేమిటు మిమ్ము యెచ్చరించఁదగును ॥ ఇద్ద ॥

కలసీఁ బెండ్లాడరాదా గక్కనఁ బానుపుమీఁద
తలఁపు చేకొనరాదా తమకించీని
యెలమి శ్రీవేంకటేశ యింతి నిట్టె యేలితివి
చెలి నొడఁగూర్చి మిమ్ము లాలించే మిఁకను ॥ ఇద్ద ॥ 5

బౌళి

నలినాక్షులకెల్లాను నవ్వు వచ్చీని
పెలుచునరసములఁ బెడరేఁచ కిపుడు ॥పల్లవి॥

కలకలనగవులు కాఁతాళపుతగవులు
సలిపే వందరితోను సారెసారెకు
తెలిసెను నీజాడలు తేటతెల్లమిగాను
పలుకుల నింక నేమిఁ బచారించ కిపుడు ॥నలి॥

మంతనపుఁబ్రియములు మాటలలో నయములు
ఇంతలుగా నెరపేవు వీదులనెల్లా
దొంతులై నిలిచె నవె తొల్లె నీనేరుపులు
సంతలఁ బెట్టి యమ్మకు చాలుఁజాలు నిపుడు

జవ్వనపుమదములు సమరతి ముదములు
నివ్వటిల్లఁ జూపేవు నెమ్మది నీడ
ఇవ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
రవ్వలాయ వేపు పేడిఁబెట్ట కిపుడు ॥నలి॥ 6

రేకు 1502 పాడి

ఏమి చెప్పినాఁ జేసేను యెగ్గా నాకు
వేమారు నెంతచేసినా వెంగెమా నాకు ॥పల్లవి॥

చేరి నన్ను వేఁడుకొని చెక్కు నొక్కరాఁగాను
సారెసారెఁ బెనఁగఁగ చలమా నాకు
గారవించి నీవు నన్నుఁ గళలు చెప్పుమనఁగా
పూరకే వుండఁగ నీతో వొరటా నాకు ॥ఏమి॥

అగపడి మంచిమాట లాడఁగానే వేగిరించి
మొగసక్కెలాడ నీతో మెచ్చులా నాకు
నగుతా నీవు నన్ను నమ్మించి బాస లియ్యఁగా
పగటులు పచరించ పంతమా నాకు ॥ఏమి॥

పోదిసేసి విడెమిచ్చి పొందు నీవు నడపఁగా
కాదు గూడదన నీతో గర్వమా నాకు
యీడెన శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
సాదించ నీతోడ రాజసమా నాకు ॥ఏమి॥ 7

సామవరాళి

ఎందాఁకా మూసిమంతనా లేల సేసేవు
పందెగాఁడవై నీవే పడితరించరాదా ॥పల్లవి॥

అంకెల నీవద్ద నుండి యాపెయాడేమాటలెల్లా
వంకలొత్తి చక్కదిద్దవలెనా నీవు
పొంకముగా నేరకుంటే పూనుక నీవే వచ్చి
తెంకి నుండి మాతోను దీకొనఁగరాదా ॥ఎందాఁ॥

చుట్టిచుట్టి యాపె నాతో జూజాలాడి యోడఁగాను
రట్టుగా నెత్తులు చెప్ప ఇట్టె వలెనా
నెట్టన నీ కంతేసి నెఁ(నెం?)జేరివి గలితేను
పట్టి నీవె సారెలు పన్ను కొనరాదా ॥ఎందాఁ॥

ముంచి నాకాపె చెల్లెలై మొక్కనేరక వుండఁగా
వంచనఁ జేతులు కూడ వంచేవు నీవు
యెంచఁగ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవు
ంచి యాపె యుండితే నీకు మొక్కించుకోరాదా ॥ఎందాఁ॥ 8

శంకరాభరణం

చెప్పఁగనేఁటికి నేసినవే లిఁక
చొప్పుగ నీవే చూచుకొనేవు ॥పల్లవి॥

కన్నియ మాఁటల కసరఁగనోపక
సన్నలనే నిను జరసీని
అన్నిట ప్రౌఢవయసుదయితేఁగః
మొన్నటినేఁతకు మొగమోడీనా ॥చెప్పఁ॥

బాలకి నీతో పంతము నెఱపక
వాడిక చూపుల వడి సొలసీ
యీలాగున నీయీడుదివైతే
నాలితనమున వెఁకతీసీనా ॥చెప్పఁ॥

జవ్వని బొమ్మల జంకించనోపక
యివ్వల నిన్నిపు డెనసె నిదే
చివ్వన వింతది శ్రీవేంకటేశ్వర
రవ్వలు నేయక రతిఁ గోఁకీనా ॥చెప్పఁ॥ 9

సామంతం

ఏమి నేయవచ్చునయ్య యిల్లాండ్లకివియేల
వేమారు నిటువంటివే వేడుకాయ నీకును ॥పల్లవి॥

కెలయుచు నింతి నీతో కిమ్ముల సారె నాడేటి-
పెలుచుమాటలు నీకుఁ బ్రియమాయను
బలిమిఁ బెనఁగి నీతోఁ బైకొన్న సరసముల-
చలపాదితనములు చవులాయను ॥ఏమి॥

కెరుచు వాపె నేఁడు కెలన నవ్వులు నవ్వె
ఆరజములే నీకు ననువాయను
చేరి చేరి యప్పటిని చేతిమీఁదఁ జేయివేసి
బీరపుపంతెములే ప్రియమాయను ॥ఏమి॥

కందువఁ గాఁగిటఁ గూడి కమ్మటి నాకెకు నీకు
సందడిఁ బచ్చిసేఁతలే సాజనాయను
ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
విందులు మోవితేనెలు వీడుదోళ్లాయను ॥ఏమి॥ 10

మాళవిగౌళ

నెమ్మది నుండవయ్య నీకు నంతా సంతోసమే
సమ్మతించకుండరాదు సవతుల కిఁకను ॥పల్లవి॥

ముప్పిరిగొనఁగ నీవు మోహించిన కామినులు
చప్పనిమాట లాడినా చవిపుట్టును
యెప్పుడు నీకొలువున నెడయకుండేవారు
తప్పులెంచి కొసరినాఁ దమి రేఁగును ॥నెమ్మ॥

కోరి వేఁడి నీవు దెచ్చుకొనిన సతులు నిన్ను
చేరి యేసేఁత సేసినాఁ జిత్తము వచ్చు
మేరమీరి నీచనవు మెరసినయట్టివారు
బీరము లెంతచూపినాఁ బ్రియములై తోఁచును ॥నెమ్మ॥

మంతనాన నీ వెప్పుడు [illegible]ంచే కాంతలు
పంతా లెంత నెరపినా బాఁతియె యుఁడు
[illegible]ంతలోన శ్రీవేంకటేశ నన్ను నేలితివి
[illegible] రెటు నవ్వినా [illegible] ॥నెమ్మ॥ 11

పాడి

బహుపరాకులు నీకు పనులెన్నైనాఁ గలవు
తహతహలెల్లా మాని తలఁచుకో పొందులు ॥పల్లవి॥

కప్పురమాపె యంపఁగాఁ గానుకిచ్చి పొడగంటి-
నిప్పుడు నావిన్నపాన కేమంటివి
ముప్పిరిగొని వున్నారు ముందర నావంటివారు
తప్పక నామోము చూచి తలఁచుకో పొందులు ॥బహు॥

చెంది యాపె లేకలు నీచేతికి నే నియ్యఁగా నీ-
వందుకొన్నందుకు నడియాల మేది
యెందరైనా వచ్చి చెలు లింతకతొల్లె వున్నారు
[1]దండిగా(దండడి?) నారాకెకిఁగి తలఁచుకో పొందులు ॥బహు॥

నెచ్చెలి పిలువుమనె నిన్ను శ్రీవేంకటేశ నే-
వచ్చినపనికి నీవు వచ్చేదెపుడు
రచ్చ నిందరు నున్నారు రతి కింతలో వచ్చి
తచ్చి యాకెఁ గూడితివి తలఁచుకో పొందులు ॥బహు॥ 12

రేకు 1503 సామంతం

చూచుకో ముందటిపని మాటిదప్పకుండాను
యేచి యాకెగుణమెద్దో యెఱఁగముసుమ్మీ ॥పల్లవి॥

నమ్మికిచ్చి యాపెఁదెచ్చి నామొగము చూచి నీవు
కమ్మటి లోఁగుచు నిచ్చకము సేసేవు
దిమ్మరిమాటల యాపె దిక్కుల నీసుద్ది వింటే
యెమ్మెల నేమిసేసునో యెఱఁగముసుమ్మీ ॥చూచు॥

1. ప్రాసభంగము.

పానుపుపై నాకేఁ బెట్టి పక్కననుఁ దెరవేసి
పూని నే రాఁగా నాతో పొందుసేసేవు
నానాబుద్ధులెరిఁగినవాని యాపె యిందుకుఁగా
యా(యే?)సెపాన సాదించునో యెఱఁగముసుమ్మీ ॥చూచు॥

వొద్దికతో నాపెఁ గూడి వొడివట్టి నేఁ దియ్యఁగా
బుద్ధిచెప్పి నన్ను నేలి బుజ్జగించేవు
అద్దిరా శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
ఇద్దెన నెట్టొరసునో యెఱఁగము సుమ్మీ ॥చూచు॥ 13

ఆహిరి

ఇప్పటికోపము మీకిట్టె వుండీనా
వొప్పుగా నాతఁడు నీవు నొక్కటే కాదటవే ॥పల్లవి॥

గుట్టుతోడ నీ విభుఁడు కొంగువట్టి తీసితేను
పెట్టరానివొట్టులేల పెట్టేవే నీవు
చుట్టమై తనముచ్చట సుద్దులు నీకుఁ జెప్పితే
వట్టితప్పులెల్లా వేసి వాదింతురటవే ॥ఇప్ప॥

పాయలేక యాతఁడు నీపై బత్తిసేసితేను
చేయరానిచేఁత లేల సేసేవే నీవు
నీయెడకు జాఁలిపడి నెయ్యములు చూపితేను
చాయలాఁ సన్నలాఁజూచి చండిసేతురటవే ॥ఇప్ప॥

ఇవ్వల శ్రీవేంకటేశుఁ డిటు నిన్నుఁ గూడితేను
నవ్వరాని నవ్వులేల నవ్వేవే నీవు
పువ్వులదండలు నీకొప్పునఁ గడుఁజుట్టితేను
రవ్వగా నాతనిసిగ్గు వచ్చుపే[illegible]రటవే ॥ఇప్ప॥ 14

పాడి

ఏల కొత్తలు సేసేవు ఇప్పుడే నాతో
మేలుతోడిదానవౌత మిక్కిలి నెఱఁగవా ॥పల్లవి॥

కనుచూపులనే చూచి కాఁక లెంత చేసేవు
వనువు చూపి యెంత నమ్మించేవు
మనసులు సోదించి మర్మమేల వెదకేవు
యెనసి మోహించిన దెరఁగవా నీవు ॥ఏల॥

తరితీపులముఁ బెట్టి తమక మేల రేఁచేవు
పొరుగున నుండి యేమి పొద్దువుచ్చేవు
సరసములే యాడి చవులెంత మరపేవు
ఇరవైనదానవౌత యెరఁగవా నీవు ॥ఏల॥

ఆసలనే చిక్కించి ఆయము లేఁటి కంటేవు
సేసవెట్టి నీపెట్టు సిగ్గుదేర్చేవు
వాసితో నన్నేలితివి వరుస శ్రీవేంకటేశ
యీసరి నలమేల్మంగ నెఱఁగవా నీవు ॥ఏల॥ 15

వేళావళి

ఎఱఁగనట్టున్నాఁడవు యేల దాఁచేవు పొందులు
మఱుగున నింతి నిట్టె మన్నించరాదా ॥పల్లవి॥

చీటికిమాటికి నాపె సిగ్గులువడీ నీతో
గాటమైన నీచేవులు గాఁబోలును
మాటిదప్పకుండా నిన్నే చూచీ నప్పటి నాపె
పాటగాఁ దమకమెల్లాఁ బైకొనఁగఁబోలును ॥ఎఱఁ॥

నానఁబెట్టి ముసిముసినవ్వులు నవ్వీ నాపె
కానీలే నీయెరుకది గాఁబోలును
అనుకొని నీమాటలే ఆలకించి వినీ నాపె
వూని తన ఆసలెల్లా వుప్పొంగఁబోలును ॥ఎఱఁ॥

అంది నీవురముమీఁద నటు నెలకొనె నాపె
కందువ నలమేల్మంగ గాఁబోలును
ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
అందాలు చేసీఁ దాను అరుదుగాఁబోలును ॥ఎఱఁ॥ 16

ముఖారి

కంటిమిగా యీ వేడుకలు నే మెల్లాను
నంటున మీకెటువంటివినవులో ఇపుడు ॥పల్లవి॥

యెనసి యాకె నీవు నిద్దరు నుండఁగఁ జూచి
మనసొక్కటాయ నేఁడు మాకెల్లాను
మునుపటివలెఁ గాదు మొగములఁ గళలుబ్బె
వనితకు నీకు నెటువంటిసంతోసములో ॥కంటి॥

అలుకలుదేరి మేలమాడఁగా మిమ్మిటు చూచి
నెలవుల నవ్వు వచ్చెఁ జెలుల కెల్లా
చలముల మీవొట్లసడి వానె సిగ్గుదేరె
తలపోఁత లెటువలెఁ దాఁకు [illegible] లోఁ[illegible]నో ॥కంటి॥

వరుసతో రతి చేసి వచ్చి మీరాక చూచి
అసుదాయ సవతుల కందరికిని
సంగతి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
[illegible] పొందు లెట్టివో ॥కంటి॥ 17

ధన్నాసి

ఆసపడి వానుఁ దెంచ నది యేఁటికే
పాసివుండలేనివాఁడు వదరఁగనేఁటికే ॥పల్లవి॥

తప్పక చూచినవాఁడు దండకు రావలెఁగాక
చిప్పిలఁ గలలోనే సిగ్గులేఁటికే
కొప్పు దువ్వినవాఁడు యిక్కువ లంటవలెఁగాక
దప్పిదేరే మోవితోడ తలవంచనేఁటికే ॥ఆస॥

మేలమాడినవాఁడు కామించి కూడవలెఁగాక
యీలాగు సెలవినవ్వు లిపుడేఁటికే
కాలుదొక్కినవాఁ డిట్టె కరఁగించవలెఁగాక
ఆలిమితో సారెసారెఁ దలపోఁత లేఁటికే ॥ఆస॥

చేరి పెండ్లాడినవాఁడు చెనకఁగవలెఁగాక
ఆరీతి కాఁకల నలయఁగనేఁటికే
వూరకె శ్రీవేంకటేశుఁ డొద్దికతో నన్నుఁ గూడె
తారసిలె వలపులు తడఁబాటులేఁటికే ॥ఆస॥ 18

రేకు 1504 ముఖారి

రమణుఁడు మమ్మేల రవ్వసేసీనే
సముకాన నుండితేనే చవిపుట్టీనా ॥పల్లవి॥

బలిమిసేసి యెంత పలుమారు నవ్వినాను
వలపు గలంతేకాక వచ్చేదేమి
చలపట్టి యెన్నేసిసరసము లాడినాను
పిలువనివేరటము ప్రియములయ్యీనా ॥రమ॥

తలిగొని యెంత మొక్కి తమితోడఁ బెనఁగినా
యితవు గొలఁదేకాక యెక్కుడున్నదా
మతితెక్కి నెన్నేసికానుకలు చేతికిచ్చినా
అతిరాజసమె కాక అంతెకు వచ్చీనా ॥ రమ ॥

వేడుకతో నొడివట్టి వేమారుఁ దీసినాను
వాడికగలట్టెకాక వసమయ్యీనా
యీడనె శ్రీవేంకటేశుఁ డేలె నింతలోనె నన్ను,
వీడనిపొందులు మరివెగటయ్యీనా ॥ రమ ॥ 19

హిందోళవసంతం

వెరగంది వున్నదాన విభు నేమీ ననలేక
చురచురఁ బంతాలాడీ చోద్యమయ్యీనే ॥ పల్లవి ॥

చెక్కులఁ జెమట గారె సిగ్గులు మోమునఁదేరె
.యెక్కడిమాటలు పతి నేమనేనే
పక్కులు గట్టెను మోవి పైకొనెఁ గన్నులకావి
తక్కక నాతో నీఁక తా నేమనీనే ॥ వెర ॥

నెలుఁకొప్పు వదలె నిట్టూర్పులు పొదలె
రొటిఁగి యుండియుఁ దను నేమనేనే
తలచాయ నలపులు తలిగొనె వలపులు
తటివచ్చె రతులకు తానేమనీనే ॥ వెర ॥

నెలవినవ్వులు మించె చిత్తము చెంగలించె
యెలమి శ్రీవేంకటేశు నేమనేనే
నలి రేఁగి పందెమాడె నన్నుఁ గాఁగిటఁ గూడె
తలఁగరా దీఁక నెందూ తా నేమనీనే ॥ వెర ॥ 20

పాడి

చిత్తమెఱిఁగి సేవలు సేయుటగాక
హత్తి నీతోడఁ బెనఁగి అలయించఁదగవా ॥పల్లవి॥

యెంతచనవరినైనా యింతి నింతె నీకు నేను
చెంత నీమోవి యెంగిలిసేయవచ్చునా
వింతసతు లెఱుఁగక వెక్కసానఁ బైకొనినా
పంతమాడి ఇందరిలోఁ బచ్చిసేయఁదగవా ॥చిత్త॥

నీవెంత మన్నించినా నేనూడిగపుదాననే
వేవేలైనాఁ గాలు నీపై వేయవచ్చునా
కావరించి నిన్ను జారకామిను లెట్టుచేసినా
యీవిధాన మాకునెల్లా నెమ్మె చూపఁదగవా ॥చిత్త॥

అక్కున నెంత వుండినా అలమేలుమంగ నేను
వుక్కువంటిచన్నుల నినొత్తవచ్చునా
యెక్కుడివారు నీకున్నా యేలితివి నన్ను నేఁడు
గక్కున శ్రీ వేంకటేశ కడుమీరఁదగవా ॥చిత్త॥ 21

లలిత

ఇంత వెలపేల నీయిచ్చరాజవు
పంతము మెరసి నిన్నుఁ బంగించమా ॥పల్లవి॥

చేసినచేఁతలు నీకు చెల్లవలెనని పట్టి—
బాసలు సేయకుమీ పలుమారును
సేసవెట్టితివి తొల్లె చేకొంటివి నీవారము
యేసుద్దులు గలిగినా యెగ్గు లెంచేమా ॥ఇంత॥

మనసున నీ పనులు మఱవవలసి నాకు
వినయాలు సేయకుమీ వెల్లవిరిగా
వొనరఁ నేఁ జిన్ననాటనుండి నీ కిచ్చకురాల
నినుఁ జూచి చూచి నేరము లెంచేమా ॥ ఇంత ॥

సురతములో సిన్నక్కడిచొప్పు లెత్తకుండాను
పరవశ జేయకుమీ పక్కన నన్ను
నిరతి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
గరిమ నన్నేలితివి కాకుసేసేమా ॥ ఇంత ॥ 22

భైరవి

నీవైనా విన్నపించవే నిష్ఠూరము గాకుండాను
తావుకొన్న మొగమోట తలఁచు నా కిపుడు ॥ పల్లవి ॥

చెప్పఁజాలఁగాక తాను సిగ్గువడినంటాను
అప్పటనుండి నందరు నాడేమాటలు
తప్పనిబొంకనియట్టిదంటలై తానున్నాఁడు
వొప్పుగ నే నెఁగంది వుందాననే యిపుడు ॥ నీవై ॥

మందలించఁజాలఁగాక మనసు నొచ్చినంటాను
గొందిసంది తనమేనిగురుతులెల్లా
చందాలు సేసుక ఇట్టె సాదువలె నున్నాఁడు
అందుకే నే నవ్వి నవ్వి యలసితి నిపుడు ॥ నీవై ॥

యెచ్చరించఁజాలఁగాక ఇంతలో లోఁగినంటా
రచ్చలకెక్కినతనరతులెల్లాను
అచ్చపు శ్రీవేంకటేశుఁ డలమేలుమంగక నేను
మచ్చికతోఁ దన్నుఁ గూడి మరిగితి నిపుడు ॥ నీవై ॥ 23

గౌళ

ఇంక నేడసుద్ది నీవు యెవ్వరికి లోనయ్యేవు
సంతెవిడిచినమీఁద సంగతౌనా దూరను ॥ పల్లవి ॥

చక్కఁదనములు చూపి జాణతనములె యాడి
చిక్కించుకొనెఁగా నిన్ను చిత్తిణి యాపె
ఇక్కువ లంటి నిన్ను నెవ్వరు తమిరేఁచినా
కక్కసమై వుండుఁగాక కరఁగీనా మనసు ॥ ఇంక ॥

మోవితేనెలు కురిసి ముసిముసినవ్వు నవ్వి
కైవసము చేసుకొనెఁగా నిన్నాపె
భావించి యెవ్వతెనైనాఁ బనికివచ్చేవా నేఁడు
నీవోజ నిలుచుఁగాక నేర్పులు వచ్చీనా ॥ ఇంక ॥

వూడిగాలెల్లఁ జేసి వూరకే చన్నుల నొత్తి
కూడెఁగా శ్రీవేంకటేశ కోరి నిన్నాపె
యీడ నలమేలుమంగనయిననన్ను నేలితివి
వెనుకై వుందువుగాక వింతగాఁ జూచేవా ॥ ఇంక ॥ 24

రేకు 1505 ఆహిరి

మాటలైనా నాడరాదా మనసిచ్చి
చోటిచ్చి పిలువరాదా చుట్టమైనవాఁడవా ॥ పల్లవి ॥

తటితో నీ వింతలోనే తలవంచుకుండనేల
తెలివ నీకు మొక్కి దీవించరాదా
యెఱుఁగునో నీమర్మము లేమైనా నీకె తొల్లి
వెలివనేఁటికి నీవు వేడుకకాఁడవు ॥ మాట

వింతవా రున్నారంటా వేడుక దాఁచఁగనేల
ఇంతి బత్తిసేసీఁ జనవియ్యఁగరాదా
చెంతనుండి ఇప్పుడే సిగ్గయ్యీనో నీకేమైనా
చింతించనేఁటికి సిరిగలవాఁడవు ॥మాట॥

తలపోసి లోలోనే తమక మణఁపనేల
చెవియ పందెమువేసీఁ జెయ్యొగ్గరాదా
అలవేలుమంగ నేను అన్నిటా శ్రీవేంకటేశ
కలసితి గుట్టేఁటికి కనకాఁవాఁడవు ॥మాట॥ 25

బౌళి

ఏఁటికి వెరగువడే వెఱఁగని వానివలె
చాటిచెప్పి సణఁగులు చల్లనా నేను ॥పల్లవి॥

మంతనాన మీరిద్దరు మాటలాడుకొనఁగాను
వింతలుగా వీనులార విననా నేను
యింత సేసితినిసుమ్మీ ఇఁక లేదనకుమని
చెంతనుండి నీకెఱఁగఁ జెప్పనా నేను ॥ఏఁటి॥

ఒనసి నీవో వాకె ఇట్టె కాఁగిలించుకోఁగా
వనవులు(లి?)మిమ్ముఁ జూచి నవ్వనా నేను
కనుఁగొంటిఁజుమ్మీ మీతగవు మఱవకుమని
వొనర నీచెక్కు నొక్కనా నేను ॥ఏఁటి॥

వోవరిలో మోవితేనె లొకరొక రిచ్చుకోఁగా
మీవద్దనే కూచుండి మెచ్చనా నేను
శ్రీవేంకటేశుఁడవు జిగి నలమేల్మంగను
చేవదేరఁ గూడి సేవసేయనా నేను ॥ఏఁటి॥ 26

వరాళి

నా మొగము చూచి యెంత నగుతా సిగ్గువడేవు
కామించినవాని నిన్ను కాకుసేసేనా ॥పల్లవి॥

పెక్కుసతులను నీవు పెండ్లాడి వచ్చితివంటా
వెక్కసాన నిన్నుఁ గడు వెంగెమాడేనా
చిక్కించుక వారు నిన్నుఁ జెలరేఁగి తిట్టిరంటా
అక్కడా నిక్కడా నిన్ను నాడుకొనేనా ॥నామొ॥

వాడవారితోడ నీవు వసంతాలాడేవంటా
జాడ గాదని నిన్ను సాదించేనా
వాడిక నాసందడిలో వారికాళ్లు దాఁకెనంటా
యీడ నిన్ను గేలిసేసి యెత్తిపెట్టేనా ॥నామొ॥

కన్నవారినెల్లా నీవు కాఁగిటఁ గూడితివంటా
సన్నలా దాయలా నిన్ను జంకించేనా
అన్నిటా నలమేల్మంగనైననన్ను నేలితివి
చెన్నుగా శ్రీవేంకటేశ సిగ్గువడిచేనా ॥నామొ॥ 27

గుజ్జరి

కోపగించి పతినేల కొసరేరే చెలులాల
మాపుదాఁకా సొలసినా మతి గరఁగీనా ॥పల్లవి॥

నగుతా నేమాడినాను నమ్మికలైయె తోఁచుఁగాక
మొగసక్కెలాడితేను ఇయ్యకోలౌనా
తగులమి గలిగితే తలఁపు గలుగుఁగాక
మొగము చూడకుండితే మోహ మేడుండునే ॥కోప॥

సరవితోఁ బిలిచితే సమ్మతించవచ్చుఁగాక
బిరుదున గద్దించితే ప్రియమయ్యీనా
సరిమేను సోఁకితేను చవులెల్లాఁ బుట్టుఁగాక
విరసాన వీఁగితేను వేడుకేడ నుండునే ॥కోప॥

ననుపైన నడచితేను నాఁటుఁగాక మోహము
కొనగొన నుండితేను కూటమబ్బీనా
ఘనశ్రీవేంకటేశుఁడే నలమేలుమంగను
నను గూడె నలుక మానక యేల వుండునే ॥కోప॥ 28

రామక్రియ

ఇన్నాళ్లవలెఁ గాదు ఇటు నీవుండేలాగు
అన్నిటా నీకు నతఁడే అసమిచ్చెనా ॥పల్లవి॥

చెలరేఁగి చెలరేఁగి చిరునవ్వులు నవ్వేవు
మలసి నిన్నతఁడట్టె మన్నించెనా
కళదేరి నీమోము గర్వము నీకెక్కుడాయ
అలరి యీపెద్దరిక మాతఁడే వొసగెనా ॥ఇన్నా॥

ఆలాపించి ఆలాపించి అట్టె పాటలు వాడేవు
లాలించాతఁడు నీతో మేలము లాడెనా
రాలీఁ గొప్పున విరులు రాఁపుకత్తె వైతివి
వోలే యీమురిపెము లాతఁడే నేరిపెనా ॥ఇన్నా॥

పవళించి పవళించి పానుపుపై నలసేవు
కవగూడెనా శ్రీవేంకటేశ్వరుఁడు
ఇవల నలమేల్మంగ నిటు తానన్నేలినాఁడు
అవసరించేవు నీకు నాతఁడే రమణుఁడా ॥ఇన్నా॥ 29

భైరవి

నగుతా నీయిచ్చకొద్ది నడతుఁగాక
యెగసక్కెముగా నీతో యాసడించేనా ॥పల్లవి॥

తలఁచుకో బాసలని తగవు వడవుమని
పలుమారు నీతోను పచారించేనా
పలుకు నమ్మితినని పాసితే దోసమని
సొలసి యొక్కతెవలె సోఁకనాడేనా ॥నగు॥

చిన్నదాన నేనని చెలులు దూరుదురని
కన్నచోటుల నే కరకరిఁ బెట్టేనా
నిన్ను నీవెంచుకొమ్మని నెపమేది లేదని
విన్నపాలు సేసి నిన్ను వేసరించేనా ॥నగు॥

కూడితివి నీవని కూరిమి చుట్టమనని
యీడా నాడా నేతులు నే నిటు చూపేనా
తోడనే శ్రీవేంకటేశ దొరయ నన్నేలితివి
వాడికె కిటె రాఁగా వలదనేనా ॥నగు॥ 80

రేకు 1506 సామంతం

నీకేలే వెఱపు నేఁడు సవతులఁ జూచి
కైకొని కన్నవారిదే కంటి గురుమగాదా ।పలవి॥

[illegible]లుచున్నాఁ డదివో నీయెదుట రమణుఁడు
పిలిచి పీఁటవెట్టవే ప్రియురాలవు
తొలుతనే యాతఁడు పొత్తుతమగ[illegible]
[illegible]వారిదే [illegible]లపింతేనా ।నీకే



మాటలాడీ నదివో మనసిచ్చి అతఁడు
పాటించి వూఁకొనవే పలుమారును
కూటమికి తావచ్చి గుట్టున నుండే నేమే
వాటమైనచోటికి వచ్చుఁగదే నీరు ॥నీకే॥

చేరవచ్చె నదివో శ్రీవేంకటేశ్వరుఁడు
గారవించి కాఁగిటఁ గలయఁగదే
వారకపురతిఁ బరవశ మీఁడై తేనేమే
తారుకాణయినచోట తమిరేఁచుఁగదవే ॥నీకే॥ 31

మాళవిగౌళ

తప్పక యేమి చూచేవు తగ నాదిక్కు
యెప్పుడును నీవో ఇలేల మానే విపుడు ॥పల్లవి॥

ఆకె నీవు నేక తాన వాడుకొన్న మాటలెల్లా
మాకుఁ జెప్పేవా నీవు మాపుదాఁకాను
మైకొని నాకాతరాన మఱచి నే నడిగితే
యీకడ నమరఁజెప్ప కేల మానే విపుడు ॥తప్ప॥

సిగ్గుదేరి రతివేళఁ జేసుకొన్న మీచేఁతలు
తగ్గి దాఁచుకొనక ఇంతటఁ జూపేవా
వెగ్గళించి తమకాన వెరవక సోదించితి
యెగ్గులేకొడఁబఱచ కేల మానే విపుడు ॥తప్ప॥

కలసినప్పటి మీలోఁగలిగినవేడుకలు
నలిరేఁగి నేరిపేవా నన్నేలితివి
మెలఁగి శ్రీవేంకటేశ మిక్కిలి నిన్నొరసితి
యెలమి సమ్మతిసేయ కేల మానే విపుడు ॥తప్ప॥ 32

వరాళి

నెమ్మది నిచ్చలాలాడ నేఁడు గళిగితివిగాక
నమ్మిక నా కియ్యఁగా నన్నుల మాన్పవలదా ॥పల్లవి॥

పొంతనే యాతనికిఁగా పూనుక వచ్చేవు నీవు
యెంత బత్తిగలదాన వేమిచెప్పేదే
వింతగా నన్నుఁ బెండ్లాడి వెసఁ దెచ్చుకొనె నాఁడు
మంతనాన వద్దనక మరి యొందు వోతివే ॥నెమ్మ॥

పాడితోడ నాతనిపలుకు చెల్లఁబెట్టేవు
యేడ నేరుచుకొంటివే నీ వీసుద్దులు
తోడివారిలో నన్ను దొరకత్తెఁ జేసేవేళ
అడ వచ్చి బుద్ధిచెప్పి అడ్డగించవలదా ॥నెమ్మ॥

వొక్కటై శ్రీవేంకటేశునొద్దఁ గాచుకుండానవు
యెక్కడే నీయానోద మిందరిలోనా
గక్కన నన్నేలినాఁడు కాఁపురము సేయఁగాను
తొక్కవైతివి పాదము తొడిఁబడ నీవు ॥నెమ్మ॥ 33

కాంబోది

ఇంక నేడనుద్దులు యెవ్వరు నేమిచెప్పేరు
వంకలొత్తి మూడిఁజొచ్చి వాత వెళ్లివత్తునే ॥పల్లవి॥

వొల్లనే వద్దఁ గూచుండి వొనగూడ మాటలాడి
బల్లిదురాలవైతివే పతియెదుటను
అల్లన నీవు గోరినట్టాతఁడు నీసొమ్మాయ
చెల్లునే ఇంతటా నీకుఁ జేసినట్టెల్లాను ॥ఇంక॥

మచ్చికఁ బాదములొత్తి మంచముమీఁదట నెక్కి
అచ్చమై యాతనికి నిల్లాలవై తివే
కచ్చుపెట్టి యాతఁడు నీకై వశమైవున్నవాఁడు
అచ్చివచ్చునే నీకు నాతనిపై వలపు ॥ఇంక॥

వీడెమిచ్చి తమి రేఁచి వెలయఁగఁ దెరవేసి
తోడనే కాఁగిటఁ గూడి దొరవై తివే
వోడక శ్రీవేంకటేశుఁ డొద్దికై నిన్నుఁ గూడఁగ
యీడేరితి వౌదువు నన్నితఁడే యెఱఁగదే ॥ఇంక॥ 84

శ్రీరాగం

అందరిలో నీవు నన్ను నాసఁ బొలిపేవుగాక
పొందు నీకే కలిగితే భోగించవా ॥పల్లవి॥

చిత్తము రా నీసేవ సేయఁగలఁగాక నీకు
బత్తి గొట్టానఁ బెట్టేనా పలుమారును
వత్తునంటాఁ జెప్పేంపేవు వారివీరిచేత నేఁడు
వొత్తినే నంతక తొల్లి వొద్దంటినా ॥అంద॥

సముకాన నుండి సరసము లాడఁగలఁగాక
తమకము రేఁచేనా తగిలి నీకు
చెమటలు గారఁగాను చేతులు చాఁచేవు నీవు
అమరఁ గాఁగిలించఁగా నౌఁగాదనేనా ॥అంద॥

ననుపు సేసుక నీతో నవ్వు నవ్వఁగలఁగాక
పెనఁగి గుణము చక్కఁబెట్టేనా నేను
యెనసితివి శ్రీవేంకటేశ ఇంతలోనే నన్ను
వొనర కెన్నఁడైనా వొద్దుకొంటినా ॥అంద॥ 85

కన్నడగౌళ

ఏమనఁగవచ్చు నిఁక నింతా నీమహిమలే
అముకొన్నవలపు నీ కచ్చివచ్చెఁగా ॥పల్లవి॥

అలరి యాకెకు నెంత ఆసవెట్టితివో నీవు
నెలవుల నవ్వుకొంటాఁ జెలరేఁగీని
నలువంక చనవెల్లా నాకె కలదని వుంటి
కలిగెఁగా నీపె నొకతె నీకు నిపుడు ॥ఏమ॥

మట్టుమీర మరి నెంత మన్నించితివో నీవు
పట్టెమంచ మెక్కుకొని పాయకున్నది
తొట్టినగర్వము లాడ దొరసై నే నుందానను
నెట్టనఁ దానూఁ గొంత నేర్చెఁగా యీపనులు ॥ఏమ॥

అంది శ్రీవేంకటేశ్వర ఆకె నెట్టు గూడితివో
చిందుఁజెమటల చెలి సిగ్గువడీని
కందువ నిన్నుఁ బెండ్లాడి కైకొంటి సిరులెల్లా
విందువలె తా వచ్చెఁగా వినోదముగాను ॥ఏమ॥ 36

రేకు 1507 సౌరాష్ట్రం

ఆకె యెటువంటిది నా కానతీవయ్యా
చేకొని యిద్దరిఁ బెండ్లిసేసే [1]నిన్నిపుడు ॥పల్లవి॥

పడఁతిచన్నులమీఁద పాదా లద్దుకొంటాను
అడరినకాఁక చల్లార్చుకొనేవు
యెడసి యెవ్వతో నిన్ను యేఁపులఁ బెట్టఁగఁబోలు
కడుసీతమక మెల్లా కానవచ్చె నాకును ॥ఆకె॥

---

1 'నే నిపుడు' కావచ్చు.

